

# కాందిశీకుఁడు

డి. రాఘవ




వేంకట్రామ అండ్ కో.

బెజవాడ — మద్రాసు

# భూమిక

*

రసజ్ఞులగు పఠితలకు—

ఇందలి కథ కేవలము కల్పితము : ఆంధ్రుఁడగు నొక బర్మా కాందిశీకుఁడు ప్రాణభీతిచేఁ బరువులిడి భయంకర గిరి గహన నదీ నదములను నుత్తరించి కొండొక రేయి నొక కీకారణ్యమును బ్రవేశించి, చిక్కువడి కష్టములను దలపోసికొనుచు క్రూరసత్త్వముల నానావిధ భీషణఘోషణంబుల కులుకుచు నిట్టట్టు నడయాడుచుండ, మానవ కపాలమొకటి వానిపాదములకు దగులఁగా, నులికిపడి కొంతవడికి నిబ్బరించి, దానివంక నారయుచు మరణస్తవము చేయుచుండ, నప్పునుక పకపక నవ్వి కుశల ప్రశ్నము చేయును. పాంథుఁడా వైచిత్ర్యమున కద్భుతపడి దానితో ముచ్చటించును. అక్కపాల పాంథులకు జరిగిన వాదోపవాదములే యిందలి కథావస్తువు.

నిరపరాధులగు మానవులను నిష్కారణముగా నాహుతిఁ గొనుచున్న నేఁటి ప్రపంచ యుద్ధభీషణ కాలమున శాంత్యహింసల యౌత్కృష్ట్యములను స్థిరీకరించుటయే నా యాశయము.

“కేవల కల్పనాకథలు కృత్రిమరత్నములు” అని భట్టుమూర్తి సిద్ధాంతము. కాని, కాలపరిణామము ననుసరించి కవి నావేశించిన సత్యమును వ్యక్తీకరించుట కతఁ డెన్నియో పథకములను సృష్టించుకొనును. అవి హృదయంగమములై రసోత్పత్తిని గల్గింపఁజాలినచో, కల్పితాకల్పిత కథావివక్షతకు తావులేదని నాయభిప్రాయము. ఈ చర్చ రసజ్ఞులకు వదలి ప్రకృతమునకు వత్తును.

నే నీగ్రంథమును నెల్లూరు వాస్తవ్యులును, రసికోత్తంసులునగు శ్రీయుతులు తిక్కవరపు రామరెడ్డిగారి యర్ధాంగ లక్ష్మియును, పతివ్రతాతిలకమును, కీర్తిశేషురాలు నగు శ్రీ సుదర్శనాంబగారి పవిత్రాత్మ కంకితము చేయుచున్నాను.

నాయం దవ్యాజమయిన యనురాగమును వహించి, నన్ను పలుమరు నాహ్వానించి, సత్కరించి, యీకృతి రచనకు నన్ను బ్రోత్సహించిన శ్రీ రెడ్డిగారి కోమలహృదయము, వారి నిరాడంబర చరిత్ర, వారి విశ్వమానవ సమత్వదృష్టి, వారి విమర్శనా నైపుణ్యము, నాహృదయము నెంతయు నాకర్షించినవి. తిక్కన జయంతి సందర్భమున వారి నలంకరించిన పద్యముల నిందు పొందుపరచుట యప్రస్తుతము కాదనుకొందును.

కువకువలాడు క్రొంచెలుఁగు కోకిల కామునియైన యిమ్మహో
త్సవసమయంబునన్ జనయితన్ దనియింపఁగ నూరువార్లతో
కవుల బహూకరించు గుణగణ్యుఁ డుదారగుణైకశోభి, తి
క్కవరపు రామిరెడ్డి కవుఁగాత ననామయ సౌఖ్యసంపదల్!
కలఁతన్ జెందక రెడ్డిభూపతుల ఖడ్గచ్ఛాయలన్ జెల్గు సీ
మలు శోభిల్లెడు నాఁటి సత్కవుల సన్మానోత్సవానంద రే
ఖలు రేకెత్తెడిఁ గ్రిమ్మరన్ రసికలోకశ్రేష్ఠ! మీబోటి దా
తల చేయూఁతల నుద్భవిల్లెదరు గాదా నన్నయల్ దిక్కనల్ !

మఱియు, నీ కావ్య రచనా సందర్భమున శ్రీ రెడ్డిగారు నాకొసంగిన సలహాలు అమూల్యములై నా కెంతయు నుపకరించినవి; అందుకు వారికి నే నెంతయు కృతజ్ఞుఁడను.

భాషాభిమానము సన్నగిల్లిన యీకాలమున నిస్సహాయులై చింతిల్లు కవుల కాశాజనకముగా శ్రీరెడ్డిగారేటేట తిక్కన జయంతి మహామహముల నత్యుత్సాహముతో నెఱపుచు తండ్రిగారిపేర నూరార్లొక తెలుఁగు కవికి సమర్పించుచు, విశాలకీర్తి నార్జించుచున్నారనుట ప్రశంసా పాత్రము. ఈ గ్రంథము భృత్యబాంధవ కామధేనువై, సకల సద్గుణ గణములచే విరాజిల్లి చన్న శ్రీసుదర్శనాంబగారి కంకితము చేయబడుటచేత, నే నుదార గుణ సనాథులగు రెడ్డిరాజులతో శాశ్వత బంధుత్వము నెఱపిన వాఁడనైతిని.

శ్రీ రామిరెడ్డిగారు మత్కృతి స్వీకృతికి ప్రతిఫలముగా నాకు సముచిత భూదానము సలిపి, ఆదరించి నా కవితావేశమునకు నవనవోత్తేజమును గూర్చిరని చెప్పుకొనుట కెంతయు గర్వించుచున్నాను. వారికి నా హృదయపూర్వక నమస్కార సహస్రములు. భగవంతుఁడు శ్రీ రెడ్డిగారికిని, వారి సంతానమునకును దీర్ఘాయు రారోగ్యములను ప్రసాదించుగాక !

నెల్లూరు రెడ్డివర్యులఁగూర్చి నేనుఒకప్పుడు వ్రాసిన క్రిందిపద్యముల నిట నుద్ధరించుట అప్రస్తుతము కానేరదు.

మునుపు పలెనాటి బ్రహ్మనాయని గృహాన,దళము లెత్తిన యస్పృశ్యతానివార
ణోద్యమ ప్రరోహము పూయుచున్న దిపుడు, రెడ్డిరాజుల నెల్లూరి గడ్డమీద!
సిరులు గల్గియు గర్వదూషితులుగారు, దేశ దారిద్ర్య వారణదివ్యదీక్షఁ
బరితపింతురు రెడ్డి భూపాలవరులు, కరుణగలవారు మధుర విగ్రహులువారు.

నెల్లూరు, 5-4-1945.

కృతిసమర్పణ పుణ్యదినము — జీ. జాషువ



# అంకితము



పైదలి మిన్నయుం గడుపు పండిన
చల్లనితల్లి, దొడ్డము
త్తైదువ, రామిరెడ్డ్యలఘు దాతృ
సతీమణి, కీర్తిశేషురా,
లాదరణీయ మంజుల గుణాలయ,
సాధ్వి, సుదర్శనాంబ, స
మ్మోదమెలర్ప నాదుకృతి పుష్పవనంబు
నలంకరించుతన్!

వినుతింపం దగు నీ మనోహరుఁడు
గంభీరస్వభావుండు, నీ
కనుల న్నిత్య నివాసముండిన శుభా
కారుండు, నీపేర నీ
తెనుఁగుంగబ్బము వ్రాయఁబంచె ననురక్తిన్
దాల్పుమమ్మా! సుద
ర్శన దేవీ! ఘన దేవభూముల మహాంధ్ర
జ్యోతి ముట్టింపఁగన్. 2

పాలించెన్ గిమ్మర సింహపత్తనమునన్
ముత్యాలపందిళ్ళు క్రొం
దెలుఁగుంగైతకు నీ మనోహరుని
దాతృత్వ పరిభావంబునన్,

నెలవేర్పడ్డది నా కవిత్వమునకు న్నీ
వంగడంబందు, ధీ
గల తల్లీ! నినుఁగూడి నేర్వఁగలదింకం
బ్రోన్న తాకూతముల్. 3

సంతానంబుల నీడలన్ విరుల సెజ్జల్
నీకుఁ గల్పించుచున్
బంతుల్ దీరి నిలింప కన్యకలు నీ
పాదంబులొత్తన్ సతం

బంతుంబొంతును లేని సౌఖ్యముల
నైక్యంబందు నీ వెట్లుగా
సంతోషింతువొ! తల్లి! మత్కృతి
భుజిష్యాసాహచర్యంబులన్. 4

పూజాభాజనమైన తిక్కవరపుం
బుణ్యాన్వవాయంబునన్
దేజోరేఖలు దిద్దినా వలఘు
పాతివ్రత్య ధర్మంబునన్
సౌజన్యంబున, నోసుదర్శన
మహాసాధ్వీ శిరోరత్నమా!
గాజు న్మెట్టియ గల్గు నీస్మృతి
యలంకారంబు నీకీర్తికిన్. 5

భౌతికమైన యీ తనువువాసి,
యనంత యశశ్శరీరవై
యాతనలేని స్వర్గవిషయంబునఁ
గాపురముండియున్ దయా
శీతలదృష్టి నాదుకృతిఁ జేకొన
నాథునిలోన నుండి కెం
జేతులు సాఁచు నిన్నునుతిసేయుదునమ్మ
సుదర్శనాంబికా! 6

చల్లని చూపులం బడుచు సంపద
నిత్యము నృత్యమాడు నీ
యిల్లు సమస్తభోగములకెల్లగడా !
త్రిదశాలయంబు నె
ట్లొల్లితివమ్మ? నీకు నయి
యుమ్మలికింపని వేళ లేదు నీ
వల్లభుడుఁ సుతాసుతులు బాంధవులుం
బరివార మాప్తులుఁ. 7

ప్రతిబింబించెడి నీ స్వరూపము
దివారాత్రంబులు న్నేటికిఁ
బతినేత్రంబులఁ గర్ణవీథులఁ బ్రతి
ధ్వానించు నాలాపముల్
మతి లోకోత్తరులైన మీ మధుర
దాంపత్యంబు వర్ణించి, మా
నితమయ్యెం గవికోటి, రెడ్డిదొరసానీ!
నీకుఁ గైవారముల్. 8

చెరయందున్నది చిన్నకూతురు,
కళాస్వీకార దీక్షానిరం
తరుఁడై పుత్రుఁ డమేరికాకుఁజని
యున్నాఁడమ్మ నీ పెద్దకూ

తురుఁ దక్కంగల బిడ్డలుంగోలువ
నీ దుఃఖంబునఁ జీవితే
శ్వరుఁడున్నాఁ, డెటు కాలు నిల్పినది
దేవస్వామి లోకంబునఁ? 9

అరవిందుం బరిపూర్ణ మానసమునఁ
ధ్యానించి, యేత న్మనీ
శ్వర సందర్శనలబ్ధిచే సకలతృష్ణా
వార్ధు లింకించి, త
చ్చరణస్పర్శఁ బునీతవై, స్వకులకా
సారంబు శోభిల్లగా
అరవింద ప్రభ నుల్లసిల్లితివి,
ధన్యా! గేహినీ రత్నమా! 10

రామకృష్ణుని కృపా రమణీయ దృక్కుల
సంచార మొనరించు చలువదనము
రమణ మహర్షుల కమనీయ వాక్కుల
కాపురంబొనరించు కమ్మఁదనము
ప్రథిత పోతన భాగవత కథారచనలో
చిందిచిల్కిన చిదానందబలము
జీవితేశుని సముంచిత చరిత్రమునందు
గర్భితంబైయున్న కరుణరసము

అలవరించు కొంచు నాదర్శ గృహిణివై
చల్లినావు ప్రేమ సౌరభంబు,
నీవునిల్పిచన్న నిత్య నూతనకీర్తి
దసిలిపోదు శ్రీ సుదర్శనమ్మ! 11

ఎలబ్రాయాన ధరాహితార్థమయి
మున్నే సాధ్వీ సంతాన మీ
తెలుగుం దేశములోఁ గఠోరమగు
బందీగేహముం జేరి, ని
శ్చల కీర్తింగడియించెఁ? సద్గుణగరిష్ఠా!
సుస్థిర త్యాగ శ
క్తులు నీ స్తన్యములో రహించు నను
కొందుః, రెడ్డిరాజ్ఞీ మణీ! 12

కలహ జ్వాలలఁ గ్రాగు పేదలకు భిక్షా
దానముః జేయుచుః
జెలిమి న్నీపతి రెండుపక్షములపైఁ
జిల్కుః సమానత్వముః
గలఁతః జెందక, యావదాంధ్రిమెలమిః
శంసింప, నెల్లూరిలో
పోలఁతీ! యీశుభవర్తమానము నిలింపుల్
మెచ్చఁజాటింపుమా! 13

ఎలమి న్నీపతి పంచభక్ష్యములతో
నేఁటేట దన్పుఁ దరి
దుశ్రీల నీపేర నుగాది పుణ్యదినమందుఁ,
వస్త్రదానంబులఁ
సలుపు న్నేఁటికిఁ, దృష్టజిహ్వాలు సహస్రింబుల్
నిన్నుఁ, నీ కుమా
ర్తెల, నీ పుత్రిల, నీ మనోహరునిఁ
గీర్తించుఁ సమంచద్గతిఁ. 14

దంపతుల కిరువురకు నను
కంపాగుణమొక్కటీలఁ గలుగదు ధర, పు
ణ్యంపుం దంపతులకు మీ
కింపారుట ప్రజల సుకృతమే హేతువగుఁ. 15

నిరతంబుఁ నిరుపేదలందలఁచి
కన్నీర్నించుచుఁ సత్కళా
దరణ వ్యగ్రి మనస్కతం దనరు
నాత్మస్వామికి న్నీడగా
ధరణి న్నిల్వక దాటి పోయితి
మహేంద్రక్షోణికి, న్నీహృదం
తరమందున్న రహస్యముఁ దెలియ
సాధ్యంబౌనె మాబోంట్లకుఁ? 16

నీ చరితంబు సత్కవుల నిర్మల
వాణికి గూర్చె వర్ణనా
ధీ చతురత్వమున్, గులసతీమణి
కోటికి గౌరవంబు, నీ
పూచిన కీర్తిచే దెలుగుపుణ్య
పురంధ్రి సముజ్జ్వలించియున్
దాచికొనెన్ భవత్తనులతం
గబళించి కృతఘ్న చిత్తయై. 17

నీ నిజనాయకుండు కరుణించిన
సత్కవికోటిలోపలన్
నేనొకరుండ, నాదుకృతి నీదుగళంబు
నలంకరించి, స
న్మానితమైనచో దివిజనాథుని
సంస్కృత సత్కవీశ్వరుల్
పూని ప్రశంస సేయుదురు పూత
మెఱుంగు తెలుంగు బోడుముల్. 18

మగని మనో విశుద్ధమణి
మంటపసీమల నచ్చువడ్డ నీ
యగణిత సుస్వరూపమున
కచ్చట నిచ్చట పూజసేయఁ గొ్రి

న్నగవులతో నెదుర్కొనెడు
నాకృతి, నీపతి మేలి మన్ననల
మిగిలిన పూజ్యవర్తన సు
మీ! ప్రమదంబున నాదరింపుమీ! 19

అలఘు పట్టాభి రామాభిధానుని మేలి
బంగారు కడుపునఁ బ్రభవమంది,
రామిరెడ్డి గుణాభిరాముని ప్రణయంపు
దొరసానియగుచుఁ గాపురముచేసి,
కొడుకులుం గూతులుం దొడవులుగా దొడ్డ
మాతృతా విభవ విఖ్యాతి నలరి
ఘనతరంబగు శీలమున సింహపురిరెడ్డి
ననబోండ్లలో ఘురానావహించి
తనివిఁ జెందిన భృత్య బాంధవ సహస్ర
భావసీమల నిత్యనివాసమున్న
శ్రీ సుదర్శన దేవి మంజీరరవళి
సతము నినదించుగాత ! మత్కృతి ముఖమున. 20

వరవిం బెండిలియాడె రెండవ తనూజల
నీదు తమ్ముండు, మం
తిరి గోపాల మనీషి, నేడతఁడు జాతీ
యోద్యమావేశ బం

ధురుఁడై బంధితుఁడైనవాఁడు,
చెరయందుఁ భర్తతో భార్యయుఁ
జెరకుంబోయె, సతీత్వ గౌరవ శుభ
శీలం బ్రతిష్ఠించుచుఁ. 21

నీవుఁ ఖద్దరుదీక్షతో మెలఁగి, గాంధీ
శాంతి సన్న్యాసి యా
జ్ఞావర్తిం బ్రియునంపవో చెఱ
కనూనంబైన హర్షంబునఁ!

నీవై రాగ్యముఁ ద్యాగముం బ్రబలమై
నీసంతతిం జెందె, నీ
కీవృత్తాంతము కర్ణపేయమగుఁగా దే
వీరపుణ్యాంగనా! 22

గౌనముల్ - పొంపిరివోవు నీవలపు
టుగ్గుంబాలతోఁ బోల్చి నీ
యనుగుం గూతులునుం గుమారకులు
విద్యాబుద్ధుల న్నేర్చి తం
డ్రిని మెప్పించిరి, వంశముం దనివిఁ జెందెఁ
దల్లి! నీవంటి సా
ధ్విని సేవించి మదీయ కావ్యము
శుభాప్తిం దేలి వర్ధిల్లుతఁ. 23

నియతిమెయి జరుగు తిక్కన
జయంతి సందర్భమందు సత్కవులకు నీ
ప్రియుఁడొసఁగు నూరునారులు
స్వయముగ నేటేటఁ గూర్మి జనకుని పేరన్. 24

నివసింపదమ్మ! నీధవుని మానసమందు
విశ్వనాశక కుల ద్వేషలవము
విహరింపదమ్మ! నీగృహమేధి కడకంట
నిందార్హ మగు గర్వ నీరదంబు
ప్రభవింపదమ్మ! నీప్రాణేశ్వరునినోట
వెగటైన యొక చిన్ని వేడిమాట
యెడబాయదమ్మ! నీ హృదయేశ్వరుని జిహ్వ
స్తవనీయమగు సత్యసౌరభంబు

సాగదెన్నఁడు జీవితేశ్వరుని పదము
కలుషితములైన వక్రమార్గములయందు
ప్రేమితంబైన నీదు పవిత్రమూర్తి
మాసిపోలేదు తల్లి నీ మగనియెడద. 25

గురుదేవుండని గాంధిచే నుతులు మ్రొక్కుల్
గాంచి విశ్వంభరా
భరితోద్గాఢ యశస్సుఁగాంచిన కళా
పాథోధి, ఠాగోరు న

కృ అదీరన్ భజియించి నీకొమరితల్
గారాబుఁ బుత్రుల్ సహో
దరుఁడున్ లీలగఁ డించినారలు ప్రసి
ద్ధంబైన విజ్ఞానమున్. 26

శాంతిని కేతనంబునఁ బ్ర
శాంతమరుత్తులు వీచుచోట, భా
స్వంత సమాన తేజుఁ డల
వంగకవీంద్రుఁడు విశ్వభారతీ
కాంతకె గీతికాంజలిని
కంఠమునన్ గయిసేయువేళ, నీ
సంతితి యభ్యసించె కవి
సన్నిధి దేశహితైక దీక్షలన్. 27

శ్యామల దేవి, నీవలపు
చక్కని పెద్దతనూజ, భూరి వి
ద్యామహనీయయై యనుఁగుఁ
దండ్రి మనస్సుహరించి, స్వీయ వం
శామలకీర్తికిన్ దళుకు
లద్దినదమ్మ సుదర్శనాంబికా!
"నోముల నోచినమ్మల త
నూభవ లజ్జలుగా జనింతురే?" 28

ఏపారు ముక్కు పచ్చల
పూపవయస్సుననఁ దెల్గుఁబువుఁబోఁడులలో
దీపమయి తాల్చె నతి వి
ద్యా పుష్పిత సుప్రతిష్ఠ యం. యే.: బిరుదున్. 29

అమెరికాఖండ దివ్యసభాంతరములఁ
బత్రిక లలంకరింప నుపన్యసించె
ప్రథమపుత్రుండు పట్టాభిరామిరెడ్డి
మొన్న మొన్నన, సుతుల యభ్యుదయ గాథ,
నీశ్రీవోలంకృతంబుగా నెగడుగాదె? 30

ఇంతులకు నెల్ల మేలిమి
బంతియగుచు విభుని మెప్పువడసిన లక్ష్మీ
కాంతమ్మ త్యాగమునకున్
సంతోషించెదరు నేఁడు జాతిప్రముఖుల్. 31

అనసూయ కుద్దియగు నీ
యనసూయాంబిక సముజ్జ్వలాదర్శగుణో
ద్ఘన, యనుఁగుఁ దండ్రి కన్నుల
ఘనురాగము జూరలాడు ననవరతంబున్. 32

శ్రీమతి శకుంతలాంబ, సు
ధామంజులవాఙ్నిధాన! దాతృత్వగుణ
శ్రీమహిత, సేమమిచ్చుట,
నీమానసవర్తి విభుఁడు నెగడున్సుఖియై. 33

శివకుమారరెడ్డి చిన్నినీకడగొట్టు
ముద్దుపుత్రుఁడెల్ల విద్యలను
గడనసేయుచుండె, ఘనతరంబైన నీ
ప్రేమవృష్టి, విస్తరింపుమమ్మ ! **34**

పరహితమతి గోపాలయ
చెరసాలకు నగ్గమగుచు జీవితమెల్లన్
గఱకులఁబడియెడి, నీసో
దరులు న్నినుఁబోలె, పుణ్యతములు పురంధ్రీ ! **35**

పసి తనమునఁ దనమెయిఁగల
పసిండి నగలెల్ల దేశభక్తులకిడి వం
గసమున కింపొనరించిన
ప్రసిద్ధకథ నీ మనస్సుఁబండించెఁగదా? **36**



# కాందిశీకుఁడు

తెక్కలతో నభంబునఁ జ
　　రించుచు, దిక్కులనిండ నిప్పులన్
గ్రక్కుచునున్న నేఁటి రణ
　　మృత్యువు సేయు దురాగతంబులన్
లెక్కబలంబుసూపి, ధృతి
　　వీడిన కొందొక పౌరుఁ డొంటిమై,
జిక్కువడెన్ మహాగహన
　　సీమల రబ్బరుబండు కొండలన్　　1

భయవిహ్వాల చిత్తుఁడు మన
　పరియాణికుం డొక్క నీపపాదపమునకున్
మెయిఁజేర్చి మూర్ఛ మునిఁగెన్;
　వయసుడిగిసపొద్దు నపరవనధి మునింగెన్.　　2

కాందిశీకుఁడు వనసింహ గర్జనములఁ
　దెలివి దళుకొత్త పెనుమూర్ఛఁ దేరి లేచె,
నంధకారంబు దిక్కుల నావరించి
　యదిమి భూనభంబుల ముద్దులాడుచుండె.　　3

పొక్కిన పదములఁ; జెమ్మట
గ్రిక్కు శరీరంబుతోడ, కాఱుటడవిలో
దిక్కరి కన్నులనీరము
గుక్కుకొనుచు గడపసాగె ఘోరనిశీథిన్. 4

వనసత్వములఁ బంచ బంగాళ మొనరించు
సింహమ్ములకు నమస్కృతులొనర్చి,
జడల దయ్యములకై వడి గాలిఁదూగాడు
వృక్షరాజికిఁ జేతులెత్తి మ్రొక్కి,
యూరకూరకన గుడ్లురిమి నిప్పులుగ్రక్కు
గుడ్లగూబల కేల్‌కోళ్లు నెఱపి,
కదలు దివ్వెలబోలు కనులఁ గొండలుడిగ్గు
మువ్వన్నె మెకములఁ బూజఁజేసి;
అడవి సత్తికిఁ బలుమరు నంజలించి,
యేడుగొండల దేవుని నెదభజించి,
ఆపదలలోన భక్తి రెండంతలగుట
వాస్తవముఁజేసె, ధృతిజాఱి బాటసారి. 5

వాఁడెక్కి దిగనికొండయు,
వాఁడీదని యేరు, తినని వన్యఫలంబుల్,
వాఁడు భజింపని దేవుఁడు
లేఁ, డంతటి దీనమూర్తి లేఁడు ధరిత్రిన్, 6

అతఁడాసాముగమించి, యుత్తరముగా
యానంబుసాగించి, భా
రతమున్ జొచ్చి, యఖండ జాహ్నవి తట
ప్రాంతోరు కాంతారసం
తతులన్ దాటి, మహానదిన్ గడచి, యాం
ధ్రక్షోణిఁ బ్రాపించి, శో
భితజన్మస్థల పుణ్యవాయువులు సే
వించెన్ గత శ్రాంతుఁడై.

పర్వతములు నదులు ప్రతిపదార్థంబును
స్వాగతంబొనర్చి పల్కరించి,
ఆదరించినట్లు లై యింపుగావించె;
కన్నతల్లిగాదె కన్నభూమి! 7

నల్లమలకొండలం దొకనాఁటిరాత్రి
పొద్దుగ్రుంకిన కతమునఁ బొద్దుబుచ్చె,
కాందిశీకున కత్యుగ్ర కాననములు
దోస్తికతమునఁ దనయింటి తోఁటలయ్యె. 8

ఆకటిసొద ముమ్మరమై
చీకాకయియున్న యతనిచిత్తమున క్షుధా
వ్యాకులిత సర్వమర్త్యా
నీకము గన్పట్టె నెదుట నిల్చిన కరణిన్. 9

"చెలువుల్ చిమ్మెడు పాలతాలపయి ము
చ్చెల్ కుచ్చు లల్లాడ ని
చ్చలు క్రీడించెడు నాకు గర్కశ శిలా
సంతాన కాంతార భూ
ములలో, నన్వయమయ్యె నిష్పాదనయం
బుల్ గట్టియల్ గొట్టు పే
దల పాదాల స్రవించు రక్తగత బా
ధా దీర్ఘ సందేశముల్. 10

"ఆడంగుల్ కలవారి తొయ్యలు లనూ
ర్వ్యంపశ్యలై, హాయిగా
మాడీలం బరదాలలో మెరయు శం
పావల్లులై యొప్ప నా
నాడుం గొండల కోనలన్ గృషిక కాం
తల్ మూపులం బాప ల
ల్లాడం గష్టముచేయు దృశ్యములు నా
యాత్మం బ్రపీడించెడిన్." 11

అని తలఁచుచుండ, మానిసి
పునుకయొకటి వాని పాదములకుఁ దగులఁగాఁ
గనుగొని చిత్తము ఝల్లన,
వెనుకకొదిగి నిలిచె నారవిచ్చిన కనులన్. 12

"వసుధ ననుబోలు నొక మందభాగ్యుఁ డెవుఁడొ
తనువు చాలించియుండుఁ గాంతారసీమ,
యుదిత భీషణ విపదబ్ధు లుత్తరించి,
దైవసన్నిధిఁ జెన్నారు ధన్యుఁడితఁడు. **13**

"ఉభయ లోకాల యనుభూతి నుల్లసిల్లి
శాశ్వత సమాధి నున్న నిశ్చలుఁడితండు,
ఐహిక విలాస సంతత వ్యగ్రమయిన
బ్రతుకు సాగించు నాశోపహతుఁడ నేను. **14**

"చలనములేని యీతని ప్రశాం
తిని భంగముసేయ నేర్చునే
ప్రళయ సహస్రముల్? యుగపరం
పర మారుపుసేయుచున్న భూ **15**

తల నటనా కథాంక సము
దాయములెన్ని నటించిపోయెనో
మెలకువలేని యీ పునుక
మీఁదుగఁ గాలసముద్ర కుక్షికిన్!" **16**

అని పలుకు కాందిశీకుని
తనువు పులకరింప, గుండె దడ యెత్తఁగఁ, గా
ననమెల్ల మారుమ్రోయఁగ,
నను నిట్లు కపాల మట్టహాసోత్కటమై; 17

"విరమింపవోయి ! పాంథా!
మరణ స్తవమింక, దీన మానవకోటిన్
మురిపించు మాటలివి దు
ర్భరము లనాధారరిక్త వాదాంశంబుల్." 18

అచ్చెరువు పడుచు పాంథుఁడు,
బచ్చెన బొమ్మట్లు కొంతవడి నిలిచి "యహో!
పుచ్చెగదా ! భాషించుట
యచ్చెరు!" వని గుండె యాని యానక లోనన్. 19

దయ్యోమనుచు గుండెదడగొత్త మృదువైన
పల్కుతీరుచూచి భయము దక్కి,
నమ్మి నమ్మలేక, నలుదెసల్ సూచుచు,
బాటసారి మారుపలికె నిట్లు. 20

"నను దౌర్భాగ్యుని గాసిపెట్ట వెనువెంటన్
బడ్డ కర్మంబవో!
వనభూమిన్ జరియించు రక్కసివో! నీ
వాసస్థలంబెద్ది? చ
చ్చిన నీవేగతి పల్కనేర్చితివో! యీ
చిత్రంబు వాకుచ్చి నా
యనుమానంబు శమింపజేయుము మహా
త్మా! దేహమల్లాడెడిన్." 21

అనిన, పకపకనవ్వి యప్పునుక పలుకు :-

"కర్మమునుగాను, చిలిపి రక్కసినిగాను,
జగతి నినుఁబోలి యొకనాఁడు జన్మమెత్తి
క్షోణివాసిన బౌద్ధభిక్షుకుఁడ నేను. 22

"భయద మానవ భ్రష్ట కపాలములను
నా హయామున జూచియున్నాఁడ నేను;
నా కపాలాస్థి, అటువలె నీకుదోచు,
సృష్టి పరిణామమున కింత చింతయేల? 23

"అనుమానించెద వేల? రమ్మిటు వయ
స్యా! రేపు నన్నుంబలెన్
దనువుంబాసి శ్మశాన భూముల ననం
తప్రేత భూతాళితో
మనవో! చూడవొ! రుండపంక్తులు భయో
న్మగ్నాంత రంగుండవై
వనభూమిన్ జరియించు నీ చరితమున్
వాక్రుచ్చు మాద్యంతమున్. 24

"దుమ్మైపోయె సుఖాను కూల్యమగు పి
ద్వ్యదేహ మేనాఁడొ! యీ
యెమ్ముల్ నిల్చె. నెడారి గాడ్పులయిపో
యెన్ బ్రాణముల్, సర్వశూ

న్యమ్ముగ బ్రేతుణ భీషణంబగు శ్మశా
న క్షోణి వేదాంతమును
నమ్మింపంగల సాధనంబన యు
న్నా నీకపాలాస్థినై. 25

"జీవితులైన బందుగులు
చిందిన బాష్పనదీనదాలలో
ప్లావితమైన మాదగు క
పాలపరంపర తారహారమై
భూవనితామతల్లి ఋణముగ
దుదముట్టఁగఁదీర్చి, జీర్ణమై
పోవు, యుగాంతరానఁ గ్రమత
పుణ్యాల బంగరుపంట చేలకుగ, 26

"అది, మొన్న మొన్న దేహంబూడ్చి విశ్వంబు
వాసి వచ్చిన పిల్లవాని శవము,
అది, రాజ్యకాంక్ష నాహవభూమిలోనఁ గూ
లిన రాచవాని కళేబరంబు,
అది, మనుష్యులఁ జూచి బెదరి యవ్వాలబడ్డ
ఆచారవంతుని యస్థిపేటి,
అది, బిట్టు టాకఁటి సొదకు నగ్గంబైన
కడు పేదరాలి కంకాళయష్టి,

అది, మహార్తుల ప్రబల దాహములు దీర్పఁ
గనులు దడిసిన యార్ద్రచిత్తుని సమాధి;
మృత్యువశమైన మా తనూమృత్తికలను
వాయు ధూర్తుఁడు తూర్పారఁ బట్టుఁదొడఁగె. 27

"పరలోక రత్న కవాట దర్శనలబ్ధి
కలుగలే దింక మాకన్నుఁగవకు,
జగములాశించు నీశ్వరకంఠ నినదంబు
వినుపింప దింక మా వీనుఁగవకు,
మహితనందన గంధవహ కిశోర శ్రేణి
తాకలే దింక మా తనులతలకు,
అనిమిషుల్ భక్షించు నమృత భోజనతుష్టి
చెందలే దింక మా జిహ్వికలకు,

అబ్దశతకచయము లంతరించెనుగాని,
అమరలోకవాస మమరలేదు,
అమరునట్టివేళ యరుదెంచునో ముందు
కలుగదేమొ మాకు క్షపణకులకు" 28

మతము నిషా యంగంబున
జతించియున్నట్టి కాందిశీకుఁడు, క్రోధో
ద్ధతుఁడై, యిట్లనుఁ, బునుకఁ
బ్రతికిన వాఁడన్న పిచ్చిభ్రమ కగ్గంబై. 29

"వేదంబుల్ తలక్రిందుగా సలిపి, బై
బిల్ ప్రేమ సిద్ధాంతముల్
బూదింబుంపి, ఖురాను సత్యమును వ
మ్ముల్ జేసినా వక్కటా !
లేదా స్వర్గము ? సృష్టికర్తయును ఖా
ళీయయ్యెనా? యెందుకీ
దూదిం బోలిన పల్కు? లింతటి వినీ
తుల్ చచ్చి సాధించితే ? 30

"పుత్త్రప్రగద ! మఱచితినా
పుత్త్రుల్ జన్మించు బుద్ధి బోదం డ్రియయో !
నెత్తికపాలను ! హృదయము
చుఱ్ఱుమనెడి, నీ విచిత్రసూక్తులు విన్నన్." 31

అని క్రోధ రుద్ధకంఠ
స్వనమున వాకుచ్చు బాటసారింగని, య
ల్లన స్వర్గనరకముల నిం
పున నిట్లని నిర్వచించెఁ బున్కు మృదూక్తిన్. 32

"శాంతి స్వర్గంబు, నరక మశాంతి యనుచు
నిర్వచింతురు మాఁబౌద్ధ నియమరతులు
స్వర్గసృష్టికి బుద్ధుండె స్రష్టయందు
సర్వమతముల సిద్ధాంత సార మిదియె. 33

"బుద్ధదేవుని సత్కళాపుంజమెల్ల
నీ శ్వరాకారమని బోధ్ధలెన్నుచుండ్రు
స్వర్గనరకాలు రెండు నీ జగతియందె
నరుఁడు సృష్టింపగలడని నమ్మగలను. **34**

"ఎనలేనిదుఃఖవహ్నికి ధాయ్యమైనట్టి
తృష్ణ నెల్లరును హరించుచోటు,
నిరపాయకరములై తిరుగు ప్రాణులమేను
కత్తుల కర్గముగానిచోటు,
ఎల్లజాతులవార లేకోదరులయట్లు
ముద్దుముద్దుగపొంది పొసఁగుచోటు,
వెలితిచే శుష్కించు పేదసాదల డొక్క
ముప్పూట లనువుగాఁ బూడుచోటు,

ఇంద్రియ విజేతలైన మునీంద్రకోటి
మానసముబోలి కలఁతలు లేనిచోటు,
ప్రేమరసవాహినులు వెల్లి విరియుచోటు,
పరమగును, దానికొక స్థలాంతరము లేదు. **35**

౩ దివ్యలోకసృష్టియె
వేదాదులు పల్కుచుండు వివిధగతుల, దు
ర్వాదోపవాదములచే
భేదోద్దేశములు జగతి వెలసినవి సఖా! **36**

"కనుపింపరాదన్న కటకటాకటఁ దూలి
క్షుభితమౌ దీన భిక్షుకచయంబు,
పరివహింపరాదన్న స్వార్థబీజములఁ బో
షణసేయు దీర్ఘతృష్ణాఝురంబు
సాగరాదన్న రాచరికంబుసేయు తు
చ్ఛంబైన యిచ్ఛ నీచతలదాడి,
మనగూడదన్న దుర్మతముల పేరటఁ
దలయెత్తు నెత్తుటి కలహారభస,

బ్రతుకరాదన్న టక్కరి పన్నుగడలు,
సాగరాదన్న ఘన నిరుద్యోగధాక,
ధనము ధాన్యంబు నొకని పెత్తనముక్రింద
కట్టువడి వ్యర్థముగ తుప్పుఁబట్టరాదు. 37

"నేను పుట్టి గిట్టి నేఁటికి దాదాపు
పుష్కరములు నూరు ముగిసియుండు,
ఏ మతాలు పోడమె? నే పోకడలు పోయె?
కట్టు బొట్టులేని కాలరథము? 38

"సవరించినా సహింసా దివ్యతర ముదరి
కొరివ్వాడి సింగంబు కోరమీఁద,
వారించినాఁడ నూరూర నెత్తుటికూటి
శాక్తేయు లొనరించు శక్తిపూజ,

పర్యటించితి మంచువలచు కొండలదాక
చిరుచీమ తలకాయ చిదుకకుండ,
సంధించినాఁడ నిశ్చల సమత్వజ్యోతి
జాత్యహంకార దార్ఢ్యము శమింప,
ఆశ లుపసంహరించి సన్న్యాసినగుచు
పట్టుకొన్నాఁడ భిక్షా కపాలపాత్రి
వెనుక నాగార్జునుండు స్థాపించినట్టి
స్థూపములమీద నాపేరుఁ జూడఁగలవు. 39

"నాచేతఁ విరచించితిఁ మును పజం
తా గహ్వర శ్రేణులఁ
భూచక్రేశుని బుద్ధదేవుని మహా
త్మ్యఁ జిత్రవర్ణంబులఁ,
ప్రాచీనంబగు నాంధ్రశిల్పమున కా
పాదించితిఁ శాశ్వత
ప్రాచుర్యంబును, శాక్యసింహుని పద
వ్యాసంగినై పొంగితిఁ. 40

"చీనా మున్నగు మిత్రభూములఁ జిగి
ర్చెఁ బౌద్ధ సిద్ధాంతముల్
నానాదేశము లాదరించినవి, మా
నాగార్జు నాచార్య

షాన్యీకంబును, స్థాపితంబులగు సం
ఘారామ సంతానముల్
మీ నేలన్ గలవే? త్యజించెదరె భూ
మీశుల్ రణేచ్ఛారతుల్ ? 41

"ఎట్టు పరిష్కరింపఁబడియెం
బలనాటి రణంబు? నాయురా
ల్పెట్టిన చిచ్చులారిచిరె?
పెద్దన బ్రహ్మన లైతమాంబ మే
ల్పట్టి, పాలేటి గుఱ్ఱములపై
విహరించిన వీరభూమిలోఁ
బుట్టిన యాంధ్ర యోధులకు బుద్ధుని
బోధలు బుద్ధికెక్కెనే ? 42

"బ్రహ్మనాయని నట్టింటఁ బ్రభవమైన
యంటుదోష నివారణోద్యమ సమస్య,
మొగ్గదొడగెనె మహదాంధ్రభూతలమున?
నన్వయించెనె ప్రజ కనైక్యపుటశాంతి? 43

"మృతినందెనే నాగులేటి మిట్టలమీద
పీడాకరంబైన కోడిపోరు?
వారింతురే మీరు పచ్చినెత్తుటిపూజ
మాచెర్ల చెన్నుని మందిరమున?

చల్లారెనే మహాసతుల నాహుతిగొన్న
సహగమనాచార దహనకీల?
మానిరే ప్రజలు సంపచ్ఛాయలణఁగించు
నీతిమాలిన త్యాగుబోతు తనము?

ఖరుఁడు దూషణుఁ డిరువురు మరణమైన,
కలుసు కార్యమపూడి మార్గములయందు
నణఁగిపోయెనె పశ్యతోహరులభీతి?
శాంతినెలకొల్పెనే బుద్ధశాసనములు? 44

"న్యాయపథంబునఁ నడచునా
భువనం? బటుగాక యాజులఁ
గాయమునొవ్వ రక్త తిల
కంబు ధరించునొ! ప్రాక్తనాజ్ఞతా
వాయుహతిఁ స్వధర్మమును
వాసి చరించునె, ప్రేమతత్త్వ ది
వ్యాయుధశక్తి విశ్వ విజయ
ప్రదమై తమముఁ హరించునే? 45

"మీాయుగ విశేషమేమిటి?
యేయేభూపతులు రాజ్యమేలెదరు? మతా
లేయవి? నేడెల్లప్రజల్
హాయిగనున్నారె? యాంధ్రి కానందంబే?" 46

అనిన పునుక పల్కు లాలించి పాంథుండు
కినుకదక్కి కొంత తనువు దెలిసి,
బుద్ధబోధకతన మూడిన సేగియు,
ప్రకృత యుగచరిత్ర బలుకసాగె :— 47

"పులుల మేకలఁ గావించి పోయినట్టి
వెడఁగు బుద్ధుని యనుఁగు శిష్యుఁడవు గాన
నెఱపుచున్నావు నిర్వీర్య నిగమబోధ!
మెట్టవేదాంతమిది కట్టిపెట్టవోయి. 48

"ఎక్కడ నాయురాలి కథ?
యెక్కడి బ్రహ్మనమాట? మాయుగం
బెక్కడ? భూతధాత్రి ధరి
యించిన పుష్పవసంత వస్త్రముల్
లెక్కిడవచ్చునే? నిదుర
లేవని నీ తలపుట్టెమీఁదుగా
చక్కఁగ దాటిపోయినవి
శాంతములైన సహస్రవర్షముల్. 49

"శిలలై, దేవతలై, మ్రొ
క్కులకుం గురియై, తెలుంగు గుమ్మెటకతలై,
కలలై, నశించి రప్పటి
నలగాముఁడు, బ్రహ్మనయును, నాయకురాలున్. 50

"పలనాటి భారతంబున
జలజాక్షుండయిన బాలచంద్రునిపిత- దో
ర్బలశాలి బ్రహ్మనాయఁడు
కలఁడందురు గుత్తికొండ గహ్వరములలో. 51

"శ్రీనాథసుకవి భక్షించిన పలనాటి
యలనాఁటి జొన్నకూడారగించి,
కారెమపుడి గొడ్డుగారంబు ఘాటికి
తాళజాలక గింగిరాలు దిరిగి,
నాఁపబండల క్రిందఁ గాపురం బొనరించు,
మండ్రగబ్బల పరామర్శలంది,
గురిగింజలం తేసి గురిజాల దోమల
గానంబునకు మేను కంపమెత్తి,

నాగులేట దాఁగినారు బాలుఁడు బ్రహ్మ
నాది తెలుఁగుమగ లనన్యయశులు!
తలఁచుకొన్న గుండె లలనాడు నీనాఁడు,
పల్లెనాడు మురికి పల్లెనాడు. 52

"శాక్యసింహుండు పోసిన చచ్చుమందు
కారణంబుగ నిమ్మహా కదనవేళ
నొక్క గుజ్జారి జాపనీయునకు వెఱచి,
పరుగులిడుచుంటివేమోయి, కపాలమిత్ర! 53

"ముగిసెఁ జరిత్రలో శుభ స
 ముత్కటమైన యుగంబు, లాలపుం
బొగ లెగఁజిమ్ముచుం బ్రళయ
 భూమిక దాల్చి యనంత వేదనా
యుగ మరుదెంచె నుగ్రనట
 నోద్ధతి, తత్పద ఘట్టనంబునన్
డెగిన యభాగ్యులన్ మిగిలి
 తిన్, హతశేషుఁడఁ గాందిశీకుఁడన్. 54

"గర్భవతియైన చిరకాల కలుషరాశి,
యుదకలాడిన దిప్పు డాయోధనంబు,
భజన కసరత్తుచేత దుర్బలములయిన
శాంతిదేశాల కిది పరీక్షాయుగంబు. 55

"శాక్యసింహుని మీ యహింసా సుధోక్తు
లాలపించెడు పెను పెగోడాలముందు
సలుపుచున్నారు కదనంపు సత్తికొలుపు
లనపరాధుల రక్తగాహనము సలిపి. 56

"అది, శివాజీవీరుఁ డహితుని కడుపులోఁ
 గత్తులాడించిన కదనభూమి,
అది, ప్రతాపుని వీరకదన సైంధవహేష
 ప్రతిశబ్ద మీనిన పర్వతంబు,

అది, త్రిలోకీ పూజ్యుఁడగు చిత్తోడ్గడరాజు
స్తంభ మెత్తించిన శాసనంబు,
అది, తెల్గురాణి దాయల రక్తపంకంబు
తిలకంబు దిద్దిన దివ్యభూమి,
అక్కటా! భారతంబు ప్రత్యూషమునందు
స్వీయ పౌరుష విశ్రాంతి చిమ్మిరేగు,
నట్టివీరుఁడు సింహాసనంహాననుఁ డిపుడు
దేబెరించెడి నర్థవిధేయుఁడగుచు! 57

“బూచిబూచి యనుచుఁ బుత్రుల వెరపించు
పిరికితల్లి మున్ను బెంచదెవని,
క్రోలినార లుగ్గుబాలతో లోకాల
వీరరసముఁ దల్లి నూరిపోయు. 58

“ముత్యాల తలంబ్రాలు పోయించుకొన్నారు
ఘనముగా జయపరిగ్రహణవేళ,
ముదముదై వార నెన్నుదుట దాలిచినారు
దురములో రక్తసిందూరరజము’
అందుకొన్నారు రాయలవారు స్వయముఁగా
నందించు తాంబూల చందనంబు,
కాసేసినారు బంగారుమువ్వలతోడ
బిరుదు టొడ్డాణంబు వీరదట్టి,

నాఁటి తెలుఁగువారి మేటిజాతీయత,
నాఁటి విజయనగర నగరభూతి,
తలఁచుకొన్న మేను పులకించి పొంగారు,
కాలమిట్టు మమ్ము గాసిపెట్టె. 59

"దిగ్గజము లిపుడు గ్రమ్మర
దిగ్గజములలోనఁగలసె, (నచటి) దేవుండ్లయ్యో!
వగ్గులయి పరిభవంబున
సిగ్గిలుచున్నారు భ్రష్ట శిల్పాంగదులై. 60

"బ్రహ్మనాయని పలనాటి రణచరిత్ర
తిరిగిపెమెత్తుచు నూరూర దిరుగసాగె,
కనమనీని మహోగ్ర హుంకారరవళి
గుమ్మెటల కుత్తుకలయందు నుమ్మలించు. 61

"నాఁడు పలుచవడ్డ నవ్యాంధ్ర తేజంబు
లీలఁ బ్రజ్వరిల్ల లేదు మరల;
వెట్టిగొల్ల డొకఁడ వీరులపూజించి
శివముబట్టి యిపుడు చిందులాడు. 62

"ఏ దేశం బల బుద్ధదేవుని కృపా
దృష్టిం బ్రశంసించి, త
త్పాద ద్వంద్వము నాశ్రయించి, ఘన భూ
తపేమ శాసించెనో?

యీ దేశంబ మనుష్యరక్తనదులం
దాప్లావముం జేసె; నీ
వేదాంతంబులు బూటకంబులనుచుం
విశ్వంబు చింతించెడిన్. 63

గీతాకృష్ణుఁడు గావలె
నీ తరుణమునందు, గాంధి యేమిటికి? మహా
గౌతమ బుద్ధుండేటికి?
మా తనువల్లికలు పిరికిమందులఁ జివికెన్. 64

'ఇది నాజూకు యుగంబు, పూర్వులకు లే
వీలాటి సౌకర్యముల్
హృదయాహ్లాదక యంత్రవాహన శతం,
బీలాహిరీ గాన సం
పద, లీ బొమ్మలనేత సన్నపని మే
ల్మాంధాళి వస్త్రావళుల్,
నిదురింపన్ గల వేల్పు లిప్పటి నరుల్
నిక్కంబు వాకిచ్చినన్. 65

"బుద్ధునంతటి యే మహాత్మునకో కాని
పలుక దానాఁటి యాకాశవాణి మీఁదు,
ఇరువదియు నాల్గుగంటలు మొరయుచుండు
వాడవాడలఁ జెవియొగ్గువాఁడు లేఁడు. 66

"శాస్త్రములలోన నెన్నఁడో చదివియుందు
రమరు లెక్కిన ఘన విమానముల కథలు,
మెలఁగునిప్పుడు నిరతంబు తలలమీఁద
మిన్ను మార్మ్రోయ నినుప తుమ్మెదల కరణి. 67

"కవుల కుపమాన సామగ్రిగా రహించి
మేఘ సౌధాలు వెలిఁగించు మెరుపు లతలు
వలసినప్పుడ మా యిండ్లఁ బ్రజ్వరిల్లుఁ
బరువుతక్కువ లితర దీపములు మాకు. 68

"సకియ మీఁయుగాన సంతానయంత్రంబు,
కామతృప్తి సేయఁగలుగు దినుసు;
అద్యతనవధూటి విద్యావిభూషిత
తెరమరుంగు వాసి మెరయు మెరుము. 69

"చదువు న్మా ముసలమ్మయుఁ సకలశా
స్త్రశ్రేణి. యింపై ముదం
బొదవన్ జేసెడు నచ్చుపుస్తకచయం
బూరూర నేపారెడిన్,
చదువుం గొందఱ కంటరానిదయి దా
చంబడ్డ మీఁ కాల సం
పద మాకిప్పుడు నింద్యమై, యతి జుగు
ప్సాహేతుకం బయ్యెడిన్. 70

"వ్రతముల్ సల్పి కుమారులంగను నన
ర్థంబైన మీ కాల దు
స్థితి లేదిప్పుడు, కూటిపేదలకు ను
ద్దేశించినఁ జాలు, సం
తతకీఁ లోపము లేదు, మేమిపుడు సం
తానావరోధార్థమై
వ్రతముల్ సల్పు నవస్థ చేకురె, యథా
ర్థంబన్న! ముమ్మాటికిఁ. 71

"మా కలవారు త్యాగు లస
మానులు, దేశహితైక దీక్ష బం
దీకృతులై తపింత్రు, శయ
నింతురు కర్కశభూమిశయ్యలన్;
మా కవులాలపింతురు సమం
చిత నవ్యయుగోచితంబులై
యాకటి చిచ్చు లార్చు హృద
య ప్రవిదారి దయా కథాంశముల్. 72

"అనుఁగుం భర్తలతోడ దేశమునకై
త్యాగంబు గావించి, బం
ధన గేహాలఁ దపించు వీరసతు లు
న్నా రీయుగంబందు; మా

తెనుఁగుఁ దేశపు రెడ్డిరాజులకు జా
తిద్వేష లేశంబు లే
దనురాగోన్నతముల్ విశాలము లన
న్యంబుల్ దదాకూతముల్. 73

"అపుడున్నంతటి నిష్ఠ లే దిపుడు బ్రా
హ్మణ్యంబునఁ, గొంతనే
రుపుగా నున్నటు లేనట్టుల్ జరుపువా
రుం గొందఱున్నారు, ధ
ర్మపరుల్ సర్వకళాభిమాను లనుకం
పాయత్తులుం బొల్తు రో
రుపు లేనట్టిఁడు లెప్పుడుంగలరు ధూ
ర్తుల్ సర్వవర్ణంబులన్. 74

"కొండవటి వెక్కెముఁ దలను
గూరిచి, కార్మిక కర్షకాళితో
నడుము బిగించె నీయుగము నం
దొక నూతన సామ్యవాద మ
న్గడిబిడి, దాని దెబ్బకు వి
కావికలైనది స్వార్థజర్మనీ
జడనిధి, నేటిమారుపు ల
సంఖ్యము లంచితముల్ విచిత్రముల్. 75

"సుకవిబ్రహ్మ, దిగంతకీర్తి రుచిరాం
శుశ్రేణిచే భారతాం
బకు ముత్యాల మహాళ్ళు దీర్చిన మహా
ప్రజ్ఞాసముద్రుండు, వం
గకవీశానుఁడు, మాయుగంబున కలం
కారంబు, ఠాగోరు నా
మక విద్వ ద్దృషి, కాంచె 'నోబెల'ను స
న్మాన ప్రతిష్ఠాఢ్యతల్. 76

"శాంతి స్యందన మాగబట్టుటకు శ
స్త్రంబుల్ విసర్జించి రం
డంతేవాసులు గా నటంచు పెనుశం
ఖారావముఁ జేయుచుఁ
శాంతిజ్ఞాన దయాకదంబిత కళా
సన్న్యాసి నూరేండ్ల వాఁ
డంతశ్శాత్రవజేత లేచె నొకరుం
డాశా భ్రమాపాదియై. 77

"వెలితిపడ్డది మాకు విశ్వసౌభ్రాత్రంబు
మధురాతిమధుర సమత్వదృష్టి,
అరగొరంతయ్యె మా కార్థిక సౌఖ్యంబు
నట్టింట నవ నిధానంబులుండి,

తక్కువైనది మాకు దానపరత్వంబు
కర్ణుండు కన్నుల గదలుచుండి,
అన్వయింపదు మాకు నైకమత్యవిభూతి
తలమీఁదపగవాఁడు మెలఁగుచున్న,
కొంత స్వేచ్ఛతోఁడఁ, గొంత యస్వేచ్ఛతో,
కొంతకలిగియుండి కొంత లేక,
సర్వమున్న దనుచు సరిపుచ్చుకొందుము
చిత్రమైన బానిసీంద్ర మగుచు. 78

"అశించుచున్నార మఖిలదేశాల యు
త్తమమైన నిరత బాంధవ్యలబ్ధి,
వలతు మేనాఁడు వాక్స్వాతంత్ర్య విభవంబు,
జబ్బుకుంగని గుండెనిబ్బరంబు,
నుతియించెదము మత స్వాతంత్ర్య, మాత్మలా
భము లేని సానందభక్తిపదము,
కంటగించెదము భిక్షులకుఁ జేతులుసాచు
చేవమాలిన దాస్యజీవనంబు,
జ్ఞానవిభవమెల్ల మానవ హింసకై
వ్యయమొనర్చు భూమిదయితకోటి
తలలువంప శాంతి ధర్మ దయా సస్య
కర్షకతకు సల్పగలము నతులు!" 79

"అనిపలుక; నక్క పాలవు
కనుగుంటలనిండ నీరుగ్రమ్మఁగొనఁగ వె
చ్చని యూర్పుబుచ్చి, నిక్కఁపు
మనుజునివలె మూల్గి యిట్లుమారువచించెన్:- 80

"ఆకర్ణించితి నీవిచిత్రపుటుపన్యాసంబు
దుర్దాంత చిం
తా కాలుష్యము చిమ్మ రేగినది, మి
త్రా! శుష్కచిత్తంబునన్
నా కంకాళమునందు మున్నెపుడో జీ
ర్ణంబైన జీవాణువుల్
ప్రాకంజొచ్చెఁ గదుష్ణరక్తచలన
వ్యాపారదీప్తంబులై. 81

"గౌతముని శుభోత్కటకటాక్షములఁదడిసి,
ఆరవిచ్చిన శాంతి వాతావరణము
కలుషితంబయ్యెనే జగత్కాండమందు?
పరిభవమందెనె కరిమ్మర రక్తఋతువు? 82

"స్తవనీయంబగు బుద్ధదైవతము భి
క్షాపాత్ర కన్నీటిచే
చివుకంజొచ్చెనె? బోధివృక్షమకటా!
జీర్ణించెనే? లంబినీ

సవిధస్తాపముఁ బూడెనే? చటుల హిం
సారాక్షసీ లాస్యముల్
భువనంబుల్ వలపించెనే? అనహానం
బుల్ స్వార్థ ముష్పొంగెనే? 83

"అన్నా! నీ వధునాతన క్షణిక సా
ఖ్యాకాంక్షివై, విశ్వశాం
త్యౌన్నత్యంబు నెఱుంగఁజాలని విమూ
ఢాత్ముండవై నట్టుఁగా
నున్నా; వెక్కడిపోరు? ఎక్కడి ప్రతా
పోద్రేకముల్? కూర్చెనే
మున్నే భూపతియేని పూర్ణవిజయం
బుల్ గత్తులల్ గట్టులల్? 84

" వలసినదాని కిబ్బడిగ
భాగ్యము గూరిచి భోగులాచు, దు
ర్బలులగు దీనమానవుల
పై యధికారము సేయుచుండు రా
ట్కులభులు దాహశాంతికి జగ
త్ప్రళయంబు సృజింతు, వారి వీ
నులు విన వార్త సోదర మ
నుష్యుల ఆలుగరంగు ఘోషణల్. 85

"ఈ విజ్ఞానము పూర్వముఁ గలుగు నో
యీ, ధ్యానమాత్రింబునఁ
శ్రీవైకుంఠము సృష్టిచేసిన మహ
ర్షి శ్రేణి జన్మింపదో!
దైవం బొక్కొక మారొసంగెడు మహా
త్వప్రజ్ఞవిశ్వంభరా
దేవీ తాపకరార్థమా? హృదయ మా
ర్తిం గుందు మీగాథలఁ. 86

"అలుగుల జయమాశింపకు
మలుగులచే నలుగుశాంతి, యఖిలజగంబుఁ
నలుగుఁ, సద్ధర్మంబే
యలుఁగు సుమీ! ముజ్జగ జ్జయాకాంక్షులకుఁ. 87

"సృష్టిలోన నరుఁడు సృష్టియై జన్మించి
సృష్టి భంగపుచ్చ నిచ్ఛగించు,
చిఱుతచీమ శిరసు చిదిమి క్రిమ్మర దాని
నమకుఁబెట్ట శక్యమగునె దనకు? 88

"కాలు సేతులున్న నాలోన విజ్ఞాన
మలరుగాని, జంతువులకు గలుగ,
దేలుబడియొనర్తు హింసింతు ననుకొని
చేలయగుచు నరుఁడు విఱవీగు. 89

"కనుగొమ్మా! గిజిగానిగూ డొక తృణా
గ్రం బెట్టులంటించి క
ట్టినదో చెట్టు చిటారుకొమ్మలకుఁ బాం
డిత్యాదు లచ్చోట ను
ప్పునకుం బోలవు; గాలివానల శతం
బుఁ దూచి నిర్మించు చ
క్కని కౌశల్యము దాని చంచువునకుఁ
గల్గుఁ యథార్థంబుగన్. 90

"ఆఁడుతనమును మగతన మమరియున్న
చిన్నిసాలీఁడు పిల్లలఁజేసి కొనుచు,
కట్టుకొన్నాఁడు సన్నని పట్టుపంచె
యిముడునో లోన వేయిరాట్నములగరిమ. 91

"తేనియ గూర్చి మానవతతిన్
దనియించు ద్విరేఫకోటి వి
జ్ఞాన కదంబకంబు సుమి!
న్యాయము దప్పక రాజ్యపాలనం
బూని రహించు నందు మహి
మోన్నతిఁ గొండొక రాణియీగ; యా
తేనియ పట్టునం గల ద
తీత మహత్తర మంత్రిమెంతయున్. 92

"కందువులఁ బాయలేక పక్షములుగప్పి
కారుచిచ్చున బెళగువ్వ గరగిపోయె,
సకలమానవ సహజ వాత్సల్య గుణము
నిండియుండెడి నలఁతి ప్రాణికినిగూడ. 93

"కొమ్మకొమ్మ కెగురు కోతిబొమ్మన నున్న
హరి కిశోరమున కనన్యమోహ
రజ్జుపటిమ దక్క రహియించునే వేరు
పట్టుగాని, జోలెతొట్టిగాని? 94

"పెట్టినగుడ్డుజారి పృథివిం
బడి తుత్తుము రైనఁజూచి, యా
చెట్టున నాఁడు పావురము;
చింతిలుచుండు బెదింగి చేఁబువన్
నట్టువదొక్కుచుఁ గుణగుణధ్వని
సేయుచు నూరడించెడిఁ
జట్టుపలార్చుచుఁ వలపుజాయను
పోతు కపోతి నేర్పునఁ." 95

* * *

"ఆచరణయోగ్యములుగాని యఖిలలోక
వృత్త మొక బెత్తసాగని క్రొత్త క్రొత్త
వింతసిద్ధాంతములు వినిపించినావు
తీర్పగదవోయి! కలదు సందేహమొకటి 96

"హింసాత్మకమగు లోక మ
హింసాత్మక మగుట సాధ్యమే? మిత్రమ! యీ
మాంసాశనులకు మానవ
హింసకులకు జాలిమందు లెట్లు రుచించున్? 97

"అది గుజరాతుకోమటి దయా
రసదఘ్న విశాలదృష్టిలో
మెదలెడు స్వప్నలోకము సుమీ!
యధునాతన నూత్న ధాత్రికం
దదు,రుచించింప దీప్రజకు,
దానికి యత్నమొనర్చి సాధువుల్
బదుగురు రెంటికిం జెడిరి
భక్తులు రిక్తవిరక్తమార్గులై. 98

"ఆశావార్ధి గభీరమై యుబికి బ్ర
హ్మాండ ప్రజానీకమున్
నాశంబుం బొనరించు దుష్టయుగ మ
న్నా; యిప్పు డీనీతి వి
ద్యాశీతాంశు కళాప్రసారమునకున్
దావున్న దే? శాంతి కిం
కాశల్ లేవు, గతించిపోయితిరి:-మీ
రత్యంత పుణ్యాత్మకుల్. 99

ప్రేమతో ముట్టుకొన్నను వృశ్చికంబు
కుట్టి మిక్కుటముగ బాధపెట్టితీరు,
పాపమని చేరదీసిన పాపరాజు
చెనకకుండఁడు మరణదంష్ట్రికలచేత. 100

ఏగతి పాదమూని చరియిం
తుర్ మనుష్యులు చీమ చచ్చునం
చాగిన? సాగునే భువన
యాత్ర? పవిత్రములయ్యు బుద్ధరా
ద్దాగమముల్ విచిత్రము లనా
చరణీయము, లెట్టి సత్కృపా
సాగరుఁడేనియు న్నెరప
జాలఁడు జాలి సమ సవేళలన్. 101

నేనును బుద్ధబోధ తల
నిల్పినవాఁడన; క్రీస్తుప్రేమ త
త్త్వాన నొకింత బుద్ధి కద
పంబడి యూగిన వాఁడనే సఖా!
కాని, ప్రపంచధోరణి య
ఖండ భుజాబల దుష్టదాష్ట్యము
దాని తమై, మహావిభవ
దర్పితమై నడచుగా బ్రచండతగా" 102

అనినఁ, బుజ్జి యొకింతకాలము శిరం
బట్టిట్టులాడించి, సాం
ధునితో నిట్లను గానలో మెలఁగు జం
తువాత్రితమాలింపఁగా:—
"వినుమో పాంథ! యహింస భోగులకుఁ బ్ర
థ్వీపాలక శ్రేణికిన్
దనరున్ సాధన కందరాని యొక స్వా
ప్నక్లిష్ట వృత్తాంతమై. 103

"ఎలమి, నహింసనేర్చుకొన
దే మును బెబ్బులికోడె సన్మునీం
ద్రల పదసన్నిధిన్? ఋషివి
ధుండగు బుద్ధుని యాశ్రమంబులో
మెలఁగిన సర్పరాజు తల
మీాద వసించిన కప్ప లిప్పుడున్
గొలుచుఁ దటాకగర్భముల
గుంపులుగూడి తదార్ద్రచిత్తునిన్. 104

"ఫల పవనాహార భక్షణంబునఁ జేసి
బ్రతుక దే మును మునీశ్వరచయంబు?
తృణకందళంబులు దిని పశుప్రచయంబు
దేహదార్ఢ్యంబు సాధించుకొనదె?

తూలారగించి పారావతంబుల పిండు
కాననంబులఁ బూటఁ గడపుకొనదె?
పలుచని గాలి గర్భమునిండ బూరించి,
దృంభూవిభుండు నూరేండ్లుమనఁడె?
సింహ శార్దూల కూరరతాజీవనమున
కీవ్వసుంధర మనుజుండ హేతువగును;
నరునినై జంబ తత్పరిసరవిహార
సకల జంతూత్కరంబున సంక్రమించు 105

"పంచ భూతాత్మకంబైన ప్రకృతి సుఖము
ననుభవించెడు హక్కు మర్త్యునకె కాదు,
కలదు ప్రతి చిన్ని ప్రాణభృత్తులకుఁగూడ,
బలము గలదంచు దోపిడి సలుపఁదగదు, 106

"చితుక దహింసాజ్యోతి
ర్లతిక ధరాచక్రమెల్ల లయమైన, సమం
చిత బుద్ధ దివ్యచరణ
ద్వితయము. మన్నించియున్న దిగ్దేశములన్. 107

"ఘటికాయంత్రం బొక్కటి
ఘటియింపంబడియె నీదు కాయమునందున్
బుటుకునఁ జెడిపోయినచో
కటకట! నీమేను మృత్తికాభాండమగున్. 108

"పొగులకు మన్న! మీభరత
పుత్రులు దుర్బలులైరటంచు, ము
జ్జగమున కార్యధర్మములు
చాటిన పుణ్యుల కన్నదమ్ములై
మిగిలినమీగు శాశ్వతుల,
మిత్రుల యుగ్ర సశాత హేతులం
దెగని యహింస మి మ్మమృత
దేహులఁజేసి జయించు నుర్వరన్. 109

"ఘన వివేకానందముని యమేరికసీమ
సన్నుతింపఁగ జయస్తంభమెత్తె,
అరుణాచలము మీద నరుణ తేజశ్శాల
రమణర్షి శతుప్రమత్కమునణంచె,
అరవిందముని నిరంతర సమాధిన్నిల్చి
లోకత్రయంబు వశీకరించె,
మూడుగాళ్ల ముసలి ముసలికోమటిసెట్టి
స్వేచ్ఛా వికుంఠంబు బేరమాడె,

నాల్గు ఖండములకు నవనవోజ్జ్వలములౌ
ధర్మమార్గములకు దారిసూపి,
ఘనత నాచికొన్న ఖండంబు మనదన్న!
పౌరుషంబు మనది, ప్రజ్ఞ మనది! 110

"స్థిరత దయాపరిశ్రమఁ బ్రసి
సిద్ధివహించిన భారతాంబకున్
మురిపెపు బిడ్డ లాంధ్రు లుడి
వోని మహత్తర త్యాగదీక్షలోఁ
బెరిగినవార, లీ భువన
పీడ సహింపరు, ధర్మచింతయున్
బరహితమున్ భవన్మని జ
నంబులు కోరిన పాలుమీఁగడల్. 111

"ఊరకపోదె బుద్ధుని మృ
దూక్తి పటుత్వము క్రీస్తు ప్రేమవా
త్సారము, రామకృష్ణ ముని
చంద్రుని తాత్త్విక సౌరభంబు, ని
స్సారము లీకటారుల ద్వి
వజ్జయముల్, దుదిలేని తృష్ణకున్
గారణభూతముల్, తెరపిఁ
గానని చింతలకున్ జిరాయువుల్. 112

"ఉడుగని సత్యధర్మముల
కూపిరిసల్పని యట్టివేళ లే
ర్పడిరొండొ నొక్క మారవుడు-
భక్తి హుళిక్కి, ఝుంఝాప్రవృత్తి గా

రడి, కరుణాగుణంబు వృథ
రా యనిపించు, సముత్థితంబులై
చెడుగు నదల్చి రాజ్యమును
సేయకతీరదు ప్రేమ మిత్రమా! 113

"ఆనందించితి, మీ యుగోన్నతి కసా
ధ్యంబైన మీయాంత్రిక
జ్ఞానాభ్యున్నతికిన్, ధనాధిపుల సాం
ద్రత్యాగ రాజ్యస్థితికిన్।
దీనంబై విలపించు లోకమునకున్
విశ్రాంతి గల్పించి పెం
పూనుంగావుత! మీ పురాణ నిగమ
ప్రోద్గాథ ధర్మార్థముల్, 114

"గౌతమ బైరాగి కృపా
స్నిగ్ధేక్షణపంక్తి విశ్వవిశ్వానంద
ప్రీతఃకాంతుల జిమ్మెడు
గాత! శమించెడును గాత! కదనదవాగ్నుల్ 115

అనిపలికిన పుత్త్రికను ని
ట్లను బాంధుం డంజలించి:— "యనఘా! నీ తీ
యని బోధ తప్తమానస
మునకుం జడివానవోలి ముదముఘటించెన్. 116

"ఎన్నం డీరణవహ్ని చల్లవడు,
నిం కెన్నండు దిగ్దేశముల్
కన్నుల్ విచ్చెడి, విశ్వలోక
సమతా కల్యాణసంపత్తు లిం
కెన్నం డబ్బెడి? నానతీయ గదవే
యేదేని మార్గంబు మా
కన్నా! జ్ఞానకపాలమిత్రమ!
దయావ్యగ్రాంత రంగుండవై." 117

అని, పాంథుఁడు పృచ్ఛించిన,
వునుక యొకింతాగి- "కల దమోఘంబగు చ
క్కని మార్గ మొకటి విను" మని
వినుపింప దొడంగె మధుర విస్ఫుట భణితిఁ:; 118

"ఆచారాంతరముల్; నిరంకుశ మత
వ్యత్యస్తముల్, వర్ణముల్
నీచత్వోచ్చత, లంటరానితనముఁ
బీజంబులై విశ్వధా
త్రీ చక్రప్రళయంబు రేచెడి,
విచారింపంగ నేలా? వృథా
వాచాలత్వములుఁ బ్రలోభ నటనల్
ఘారింపఁగా నేర్చునే? 119

"తలనూపంబని లేదు సాంఘిక మతౌ
ద్ధత్యంబు లెందేని, భా
షలకున్ సర్వకళాలతాంతమున
కౌజ్జ్వల్యంబు సిద్ధింపఁగా
వలె;విశ్వైక్యత విశ్వ సోదరత విశ్వ
ప్రాజ్యజాతీయతల్
వెలయుంగావలె, హిందుముస్లిములకున్
విఖ్యాత బాంధవ్యముల్. 120

"సమరసభావ నిశ్చల పరిశ్రమకు బ్ర
హ్మాండడంబు లున్ముఖంబయినదాక,
వ్యత్యయంబైన తీవ్రాస్పృశ్యతాజాడ్య
మన్నివిధాల రూపణినదాక,
నాజాతి నాయూరు నాదేశమని పొంగు
స్వాభిమానము శూన్యమయినదాక,
విశ్వసౌభ్రాత్రింబు వెలయించు నైక్యసం
ఘావాప్తి దిశల పెంపారుదాక,

జ్ఞానమత సాంఘికస్వేచ్ఛ నల్వురకును
నేకరీతి లాభించునందాక, రాదు
భావి భారత కల్యాణ పరమసుఖము
కాకచల్లార దేవుడు సంగ్రామముఖము. 121

"ఇది నాలో నగుపించు నూతన మహా
ద్దృశ్యంబు, లేదింతకుం
బదకంబొండు ప్రపంచశాంతికి, ప్రజా
స్వాచ్ఛంద రాజ్యంబు నం
గదయున్ జింతయు లేని భారతసమాఖ్యం
బైన వైకుంఠ నం
నగ సంపాదనసేయవోయి సడుమన్
బంధించి మిత్రోత్తమా." 122

"కనులుం గర్ణము లూడిన
పునుకనగుట జూడనయితి పొలయు న్నల్లన్,
విననైతి ప్రజలయార్త
ధ్వనులన్, దలపోయ నేను ధన్యుడనయితిన్. 123

"ఏమైనారు కళత్ర పుత్రికులు? నీవి
ట్లొంటిమై గానరున్
నీ మేన్సోరిచి తప్పుకొంటి" వనినన్,
జింతాకులస్వాంతుడై
యేమాటాడక మూర్ఛమున్గి పడిపోయెన్
గాందిశీకుండు, త
త్స్వామిప్యంబుననున్న చెట్టు మొదటన్
సర్వాంగ నిశ్చేష్టుడై. 124

అతని మూర్ఛ దేర్చి యరుణుండు పకపక
నవ్వసాగెఁ దూర్పు నగముమీఁద,
పునుక పలుకదయ్యె, భూరివిషాదంబు
గుండెనిండి కన్నుగొనల వెడలె. 125

పిసువులు నలంచి కొన్ని కన్నీళ్లు సిమ్మి,
పునుక మిత్రుఁ జేసి విజ్ఞాన బోధఁ జేసి
గుండెలోఁ గొంత విశ్రాంతి కుదురుకొనఁగ,
జరిగిపోయిన కథకు పశ్చాత్తప్పడుచు— 126

"ఇది నాలోఁగల చిత్రవిభ్రమముగాని
యిక్కపాలంబు ప
ల్కదు, దేశాభ్యుద యాభిలాషినయి ర
క్తక్షోభ వారించెదన్,
సదయంబై యనఘాత్మకంబగు నహిం
సా ఖడ్గముఁ బూనెదన్,
గుదియింతుం గదనోగ్రభూతమును ది
క్కుల్ మ్రొక్కులర్పింపఁగన్." 127

అని తలఁచి, పాంథు డింటికి
జనియెం. గపాలంబు నొక్కసన్న్యాసి కరం
బునఁబూని బిచ్చమునకుఁ
జనియెన్, శుభరుత మొనర్చె శకునద్విజముల్! 128